శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# విజ్ఞప్తి.

పరమభాగవతశిఖామణులును, పతివ్రతాసతీమతల్లులు నగు నో సోదర సోదరీమణులారా!

శ్రీమదఖిలాండకోటిబ్రహ్మాండనాయకుండును, అనంత కల్యాణగుణ పరిపూర్ణుండును, సచ్చిదానంద స్వరూపుండును, నిత్యవిభూతి నాయకుండును, నగు శ్రీమన్నారాయణుని లీలావతారంబుల లెక్కింప సహస్రశీర్షంబులు గల శేషాహి కైనను శక్యంబుగా దనుట యతిశయోక్తి గాదు. అట్టి యవ తారవిశేషంబులం దెల్లను దశావతారంబులు ముఖ్యంబులు. అందును కేవల భక్తాభీష్టప్రదంబును, పండిత పామర జనా హ్లాదకరంబును, మునిజనభాగధేయంబును, సమస్త కామ ప్రదంబును, దాసజనతరణోపాయ సులభమార్గ ప్రదర్శకం బును, సమాశ్రిత గోపీజన మనోహారంబును నైన శ్రీకృష్ణా వతారంబు పరమోత్కృష్టంబు. ఏలయన—

శా. కామోత్కంఠత గోపికల్ భయమునన్ గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్
ప్రేమన్ మీరలు భక్తి నేము నిదె చక్రింగంటి మెట్లైనను
ద్ధామధ్యానగరిష్ఠుఁడైన హరిఁ జెందన్ వచ్చు ధాత్రీశ్వరా.

అని నారదుండు ధర్మరాజున కెఱింగించిన విధంబుగ నిన్నితరగతుల, నిన్ని మనోగతుల, నిన్ని సాధనాంతరముల,

నింత సులభోపాయమగు శ్రేయోమార్గంబు లొసంగి మోక్ష ప్రదానంబు గావించిన దైవం బితండుగాక మఱి యెవ్వండు గలడు? ప్రస్తుత మాంధ్రలోకంబు నావరించిన దుర్మతోద్దామ మేఘపటలంబును, సన్మతోద్ధార సంజీవిని యను జంఝానిలంబున బాఱఁద్రోలి జగజ్జేగీయమానంబగు విజయధ్వజ పతాకంబులం గాంచిన శ్రీకోదండరామసేవక ధర్మసమాజ ప్రతిష్ఠాపకులును, శ్రీమన్నారాయణ చరణకమలసేవా సమాశ్రయణ సమావేశ దాసజన దేశికాచార్యులును, మద్గురుమూర్తియును, ఆంధ్రవాల్మీకి బిరుదాంకితులు నగు శ్రీమదొంటిమిట్ట వాసుదాస యోగీంద్రస్వామివారిచే భాగవతము నుండి సముద్ధరింపఁబడిన శ్రీకృష్ణావతారతత్త్వమను గ్రంథమున నయ్యది విపులముగను సర్వజనమనోహరంబుగను వర్ణింపఁబడియె. ఆశ్రిత పారిజాతంబును, దాసజనకల్పభూజంబును, నగు చాగంటీపురి శ్రీమదభినవ కోదండరామస్వామివారి యాలయంబున (కోవెలయందు). శ్రీవారి దివ్యమంగళవిగ్రహంబర్చానుకూలంబగు మూర్తిమంతంబుగాఁ బ్రతిష్ఠింపఁబడి స్వాశ్రిత భక్తబృందంబున కపరిమితానంద దాయకంబగు టెల్లరకును విదితమయిన విషయమే. భక్తిని స్థాపింపను, ముక్తిని సాధింపను, ముఖ్యపరికరంబులగు రామ, కృష్ణ, గోవింద, నారాయణేత్యాది నామసంకీర్తనము (శ్రీహరిభజనము) కర్తవ్యం బగుట నద్దాని బలుమారులు వల్లింప నాబాలగోపాలంబున కెల్ల సాధ్యమగునంత సులభశైలిని పాటలు, పద్యములు రచించి ప్రపంచమున కెల్లను దేటతెల్లమగునట్టుల వెదజల్లియుండిరి. కాలక్రమ

బున దదీయపురోభివృద్ధికిని, మదీయ తపస్సిద్ధికిని ఫలకారణం
బగు శ్రీకోదండరామవిలాసము అను రామకీర్తనల గ్రంథమును
బ్రతిపాదించి మరలసమాశ్రయణేచ్ఛగల స్వేచ్ఛానువర్తినులగు
గోపికలకామం బర్పించుకొని యస్ఖలిత బ్రహ్మచర్యంబున
శ్రీకృష్ణభగవానుఁ డనుగ్రహించి బంధవిమోచనంబుగావిం
చిన శ్రీకృష్ణలీలయందలి కంసవధయను నీహారికథాయూపంబు
నుద్ధరించి మదీప్సితంబు సఫలంబు గావించిన శ్రీవారి నిర్హేతుక
జాయమాన కృపాకటాక్ష విశేషంబునకుఁ గృతజ్ఞతా సూచ
కంబుగా వందనశతంబు లర్పించి నే నీచరితంబు ముగించితిని.
శ్రీమద్భాగవతంబున నాకుం గల గౌరవంబున నిందలి కథా
సందర్భమునం దచ్చటచ్చట నందలిపద్యంబులనే పొందుపఱచి
భక్తిరసంబు నాశక్తికొలది పోషింప బ్రయత్నించితిని. శ్రీకృష్ణ
పరమాత్మలీలావినోదంబుల వర్ణింప బ్రహ్మాదుల కశక్యం
బనఁ దచ్చరితంబు రచింప నాబోటి యవిద్యాసంపన్నున
కలవిగాని కార్యంబే యైనను "ఉడుతభక్తి" యన్నట్లు తోఁచి
నంతమాత్రమున భగవత్కథ విన్నవింప సాహసించిన నావిజ్ఞాప
నను ప్రాజ్ఞు లనుమతింతురుగాక.

ఇట్లు ప్రార్థించు
బుధజనవిధేయుఁడు,
భక్తజనపరిచరణుడు,
దాసానుదాసుడు,
ఆనందదాసుడు.

చాగంటీపురము,
25—9—34.



గురువులు:
శ్రీ వాసుదాసస్వామి.

శిష్యుఁడు:
మారూరి మహానంది రెడ్డి,
గ్రంథకర్త.

# ప్రశంస.

శ్రీరమ్యమై యొప్పు క్షితి, నాంధ్రభూమి,
సారవంతము సేయజాలిన మిన్న
జీవనదంబుల శ్రేష్ఠత గన్న
పావనకృష్ణాస్రవంతిప్రతీచి
వెలయగ నుత్తరవాహినిదరిని
వలనొప్పు మాధవవరసమీపాన
గలదు సీతారాఘవులనివాసంబు
ఫలభరితతరసాలవనశోభితంబు
భాగవతోత్తమభాగధేయంబు
త్యాగశీలవ్రతతతి కాశ్రయంబు
నా నొప్పు వేంకటనరసింహాపురము.

ఆపురవరమునఁ గాపురమున్న
కాపువంశజుఁ డుండుఁ గడు కీర్తిఁ గన్న
ముదునూళ్ళగోత్రుండు సదమలాత్ముండు
కొదలేని ధనికుండు కోవిదప్రియుఁడు
ఆశ్రితకల్పకం బనఁదగువాఁడు
విశ్రుతగుణుఁడును ప్రియభాషణుండు
పన్నగశాయిసద్భక్తశేఖరుఁడు
అన్నపరెడ్డివంశాబ్ధిచంద్రుండు
మేలిగానంబుల మించినవాఁడు
పోలిరెడ్డి యనంగఁ బొలుపొందుఘనుఁడు
కలఁడు కంతుని మించి గ్రాలెడువాఁడు.
వలనొప్ప నాతండు ప్రాయంబునందు

సతులను నిర్వురఁ బతికనుకూల
వతులను బిచ్చమాంబ రంగమాంబ
ననువొంద వరియించి నలిననాభుండు
మునుకొని శ్రీదేవి భూదేవి నటుల;
నందు, సాధ్వికి రంగమాంబకుఁ బుట్టె
సుందరాకారుండు శుభలక్షణుండు,
కవికి జామాతయై గ్రాలెడువాఁడు,
భువి లక్ష్మణాభిఖ్యఁ బూనిన వాఁడు;
అల కృష్ణపురమాత్మునం దతిభక్తి
గలుగువాఁ డగుట నీగ్రంథ మాతండు
దిలకించినంతన దీని ముద్రింపఁ
దలఁచె; నీ యనఘుని దయ దయివార
నాయురారోగ్యంబు లధికసంపదలు
శ్రీయంబు లమరిచి, చెన్నలరార
పుత్రపౌత్రాళిని ముద మొప్పఁగూర్చి
పాత్రత నెరిగి ధర్మము సేయుబుద్ధి,
వెలయు బంధుప్రీతి పితృభక్తి నిచ్చి
చెలువొప్పఁ బ్రోచుత శ్రీకృష్ణుఁ డెపుడు.

---

శ్రీ రా మా య న మః.

శ్రీసీతాలక్ష్మణ భరత శత్రుఘ్న సహిత రామచంద్రపరబ్రహ్మణేనమః.

శ్రీకృష్ణలీల యందలి

# కంసవధ.

## [హరికథ]

### ఇష్టదేవతాప్రార్థనము.

శా॥ శ్రీకళ్యాణగుణాకరుండు త్రిజగత్ క్షేమంకరుం డార్తలో
కైకత్రాణపరాయణుండు జనకక్ష్మాధీశుజామాత సీ
తాకాంతాహృదయాబ్జబంభర మయోధ్యానేత రాముండు ని
త్యాకాంక్షన్ దయసేయుగాత మదభీష్టార్థంబు లెల్లప్పుడున్.

సీ॥ ఎవనియందు జనించు నీలోకజాలంబు
కవినోట వెడలు సత్కావ్యమటుల
నెవ్వానిలో నభివృద్ధి గాంచు జగంబు
జలధిఁ దరంగసంచయమువోలె
నెవనిలో లీనమౌ నెల్లభూతములు ద
రిద్రునికోర్కెలరీతి నెపుడు
నెవని నన్వేషింతు రవిరళగతి మునుల్
వత్సలు మొదవులవలె సతంబు
వాసుదాసహృదంతరవర్తియయ్యె
వెలసె చాగంటిపురమున వేడ్కనెవ్వ

దట్టి నీకు కోదండరామా! జోహార్లు
వాసిగ నొనర్తు నానందదాసవినుత.

సీ॥ కలుగదే మార్గంబు కైకను వంచింపఁ
పితృవాక్యపాలనప్రీతిగాక
శక్తుండు గాఁడొకో జానకిఁ గనుఁ గొన
దాసుల రక్షించు తలఁపుగాక
యొక్కండె చాలఁడె యుదధి బంధింపఁగ
జగతికి బోధించుసరణిగాక
యెదిరించి గెలువఁడె యెవ్వారినైనను
విధివ్రాలు సైరించు విధముగాక

పిలిచినంతనె ఓ యని పలుక లేడె
భక్తిని బరీక్ష జేసెడి యుక్తిగాక
రహిని చాగంటికోదండరాముఁ డనుచు
సన్నుతింతుము జానకీజాని! నిన్ను.

—* గురుమూర్తిప్రార్థనము *—

బేహాగ్ రాగము – ఆదితాళము,

భజరే గురుచరణం హేమానస ॥భజ రే॥
భజ గురుచరణం భవభయహరణం
నిజగుణకలిత మపారసుచరితమ్ ॥భజ రే॥
తామసరాజసదోషనివారణమ్
కోమలతత్త్వసుబోధనచరితమ్ ॥భజ రే॥

ఆశ్రితలోకాజ్ఞానధ్వంసమ్
అతులైకైకశిలేశ్వరభక్తమ్ ॥భజ రే॥
శ్రీపతిదాసమ్ సత్యచరిత్రమ్
చిన్మయరూపం శ్రీవాసుదాసమ్ ॥భజ రే॥

—* గణపతిప్రార్థనము *—

కల్యాణిరాగం - రూపకతాళము.

శ్రీగౌరీవరకుమార సిద్ధివినాయక గజముఖ
భోగిభూష లంబోదర భువనత్రయపాలక జయ
నీగుణతత్త్వమువర్ణన నే దెలియఁగలనె దేవ
ఓగణనాయక యభీష్ట మిడుము సదా తలతు బ్రోవు ॥శ్రీ॥
ఆగమవేద్యా సురనుత యానందదానవినుత
చాగంటిపురినాయక శ్రితజనదాయక నమో నమః
వాచమతీతా సత్కృప నొసగి రచన నిర్విఘ్నము
గాఁగ చరిత మొనగూర్పుము కంసవధం బను హరికథ ॥శ్రీ॥

—* సరస్వతీప్రార్థనము *—

హిందూస్థానితోడిరాగము - త్రిశ్రగతితాళము.

పరమకల్యాణి నిన్ భజియింతు నోవాణి
కరుణింపు వాగ్వాణి కమలసంభవురాణి ॥పరమ॥
శారద "కోరికల్" దీరఁగ జేయగన్
మేర నీకే తగుఁ శౌరిచరితముఁ
కూరిమినువ్విళ్లూరబల్కుమనసారగొల్తుభారతికృపామతి॥పర॥

వాసుదాసదేశికు మృదుభాషిణి
వందిత యానందదాసపోషణి
భాసురముగ నందనందనునికథ
బోధించినంత బల్కింపుము జననీ ॥పరమ॥

వ. ఇట్లు ఇష్టదేవతాస్తోత్రంబును సద్గురుప్రార్థనంబును గావించి చాగంటిపురి శ్రీమదభినవకోదండరామమూర్తి కంకితంబుగా నాయొనర్పంబూనిన శ్రీకృష్ణపరమాత్మలీలామానుష వినోదంబగు కంసవధయను హరికథాకలాపంబునకు క్రమాగతంబగు కవివంశానుక్రమంబు నింతకుమున్న రచియింపబడిన శ్రీకోదండరామవిలాసంబున దెల్పిన కారణంబున చర్వితచరణంబని విడచి కథాక్రమంబు విన్నవించెద.

శ్రీమద్రమారమణ గోవిందో హరి.

—* కథాప్రారంభము *—

తోహర॥ కృష్ణకృష్ణహరి,కృష్ణకృష్ణహరి,కృష్ణకృష్ణహరి,కృష్ణా।
కృష్ణకృష్ణహరి, కృష్ణకృష్ణహరి, కృష్ణకృష్ణ, శ్రీకృష్ణా॥
ఇదివినరయ్యా శ్రీకృష్ణాయనివినుతిసేయరయ్యా జనులు।
సదమలమతులై నందనందనునిసత్కృప గనరయ్యా నరులు ॥

శ్రీకృష్ణునిదివ్యచరిత్రము విన జెలగుచుండు శుభము।
నాకవాసులకు నందరాని పరమానందం బిది వినుము॥
మోక్షదాయకంబౌ మధురాపురి ముదమున యదువంశజులు।
రక్షణజేయగ నుగ్రసేనమహారాజాత్మజులగు ఖలులు॥

కంసాదులు దానవాంశమున జనకంటకులై జనియించి।
హింసకులై వంచించి యామధుర నేలుచుండి తమకించి॥

వ. ధర్మంబు విడిచి యధర్మంబునకు డాసి, తమతోడి భూనేతలం గలిసి దేశోపద్రవంబు గావింపుచున్న, భారంబు సహింపలేక భూదేవి శ్రీశుసన్నిధిం జేరి మొరలిడ నాపద్బాంధవుం డగు శ్రీమన్నారాయణుండు దుష్టజననిగ్రహంబును, శిష్టజనానుగ్రహంబును గావింప.

తోడిరాగము - రూపకతాళము.

(శ్రీ కృ ష్ణ జ న న ము.)

దేవకీవసుదేవులకును బుట్టె స్థిరపై శ్రీకృష్ణుడు
కావబూని ధరాతలమును కంసాదుల మర్దింపను
పావనశుభలగ్నంబున బ్రహ్మాదులప్రార్థనమున
భావజజనకుడు రోహిణి శ్రావణబహుళాష్టమినిఁ ॥దేవ॥
భానుకోటితేజమునను బాహుచతుష్కమునందుఁ
బూని శంఖచక్రగదాపాణియగుచు నిటులనె హరి
ఆనకదుందుభినానుడి వీనుల నిడి ఈక్షణంబ
కాననసీమఁ నందునికాంతప్రక్క న న్నిడుమనె ॥దేవకి॥
యమున దాటి నడురేయిఁ రేపల్లెను జొచ్చి హరిఁ
భామినికడ నునిచి యచటి బాలిక గొని మధురకు జని
స్వామియాజ్ఞ నెరవేర్చితి నా కేమిగతియొ నారాయణు
డేమి జేసినను జేయనిమ్ము నా కేడుగడయు నతడె యనుచు
దలచెను ॥దేవకి॥

కంసునికావలివారలు కలవరపడ యోగమాయ
హంసధ్వని కావుకావు మని యఱచిన దెలిపిరి యా
హింసకుం డతివేగంబున నెత్తి బాల నెగురవేయ
కంసా! నిను దునుమాడఁగల డొకడనిమాయమయ్యె॥ దేవ॥
వందితగుణు వసుదేవుని బంధించిన కారణమున
కొందలమందుచు కంసుడు గుండె తనుఁ నిందింపుచు
నందయశోదల ముద్దులనందనుడై కృష్ణుం డా
నందంబుననోలలాడె నందదానవరదుడు హరి ॥దేవకి॥

తోహర॥ అంతకుమున్నే రోహిణికుదయంబయ్యెను బలరామన్న
శాంతాకారుని శేషాంశజు గని సంతసంబుతో నున్న॥
పదపడి శ్రీకృష్ణుం డుదయించిన పట్టరానిప్రమదమున
సదమలమతు లా నందయశోదలు సంభ్రమంబు
గొనుచున్న॥
పుట్టిన నెలలో బాలఘాతకిని పూతన ప్రాణము దీసె।
అట్టిటు కదలుచు శకటాసురుని హతము జేసి వేసె॥
సుడిగొని విసరిన తృణావర్తు మెడ జుట్టి ధరను బడగూల్చె
కడు వేగమ కేశివ్యోమాదుల కాలునిసన్నిధి కనిచె॥

వ॥ ఇట్లు వ్రేపల్లెం జేరి సురక్షితంబుగా రామకృష్ణులు పెరుగుచుండి రంత శ్రీకృష్ణుండు శైశవక్రీడలం దగిలి॥

క॥ వల్లవగృహనవనీతము
లెల్లను భక్షించి వచ్చి యెఱుగనిభంగిఁ
దల్లి గదిసి చిట్టాడుచు,
నల్లన చనుఁ బువ్వఁ బెట్టు మవ్వా యనుచుఁ.

వ. మఱియు నబ్బాలువినోదంబులు తమయందు జేయు ప్రసాదంబు లని యెఱుంగంజాలక గోపిక లోపికలు లేక యశోదకడం జేరి.

జంఝూటిరాగము - ఆదితాళము.

చూచితివా యశోదమ్మ చిన్నికృష్ణునిదుండగములు,
కాచెదవా లే దేమమ్మ కాంత యూరు విడతుమె కొమ్మా
॥ చూచి ॥

గొల్లభామలార అంతటి యల్లరికారణ మేమి టమ్మ
కల్లలు బలుకవలదు కొమ్మ మెల్లగ వార్త దెలుపరమ్మ॥గొల్ల॥
చెలియ నీపట్టిచేసినపనులు చెప్పతరమె యశోదమ్మ
పలువతులువనలువక్రైనపట్టుటకలవిగాదోయమ్మ॥చూచి॥
ఏమిపాప మమ్మా వీడు ఇంటనె యున్నాడు శ్రీకృష్ణుడు
కామినులారా బాలుని మీాదు గని కను లోర్చకయుంటు
న్నారు ॥గొల్ల॥
బాలురకును పాలుఁ లేవని బాలెంతలు మొరలువెట్టఁ
ఆలకుఁ క్రేపు విడిచె నంభోజాక్షి నీసుతుండు ॥చూచి॥
పడతులార కావలసినపాలు గలవు గొనిపొండీ
బుడుతనిపై లేనిపోని దుడుకుమాట లాడకండీ ॥గొల్ల॥
నమ్మి నిదురపోవగను నాపట్టిని చుంచుబట్టి
తేగతోకతోడగట్టి లేమా వీథులందు దోలె ॥చూచి॥
ఆట లాడుకొనుబాలలు బాట నుండగను లేగలు
దాటిపోవ తగిలె నేమొ పాటిసేయదగునె వాటి ॥గొల్ల॥

మఱచి నిద్రింపగను వలువ తెఱచి తేలు గఱపించెను
వెఱచి బొబ్బలిడగ దాని తెఱవ! నోరు మూయించెను॥చూ॥
సుందరాంగులార! గొల్లలు మందలో నున్నందువలన
నందదాసవరదుడు మీ మందిరముల విందు గొనెను॥గొల్ల॥

వ. ఇట్లు గొల్లభామల మెల్లన నోదార్చి యిండ్ల కనిచి.

సీ॥ బాలుఁ డీతండని భావింతునందునా
యే పెద్దలును నేర రీక్రియంబు
వెఱపెఱుంగుటకునై వెఱపింతునందునా
కలిగిలే కొక్కడుగాని లేదు
వెఱపుతో నాబుద్ధి వినిపింతునందునా
తనుదానయై బుద్ధి తప్పకుండు
నొండెఱుంగక యింటనుండెడు నందునా
చొచ్చిచూడని దొకచోటు లేదు.

ఆ. తన్ను నెవ్వరైన తలపోయఁ బాటెడి
యోజ లేదు భీతి యొకటి యెఱుఁగఁ
డెలమి నూరకుండఁ డెక్కునక్కెములాడుఁ
బట్టి శాస్తి జేయు భంగి యెట్లు.

వ. అని విచారించి బాలునికి భయంబు జూపకున్న నయంబు గాదని తలంచి చేత సెలగోలం బూని "ఓహో! శ్రీకృష్ణులా వీరు" వెన్నముఖ మెన్న డెఱుంగరు కాబోలు.

తో॥ రాకుమారులకు మర్యాదగునా రవ్వగొనుట బాలా
చీకు బాపెదను చిన్నకృష్ణ నీ చేష్ట లెరిగి తింకేలా

యెన్నితప్పు లని సైరింతునురా వెఱ్ఱిపిల్లవాడా
పన్నిదమూ నీ కెన్ని చెప్పినను పడుచు కుఱ్ఱవాడా॥

బేహాగ్ రాగము — త్రిశ్రగతి తాలము.

ఏమిర శ్రీకృష్ణా నీవు వెన్నదొంగలించినావట
రామ లెంతో రవ్వజేసి యేమేమో తెల్పిరి నీపై ॥ ఏమి ॥
ఎరుగనె గోపెమ్మ నేను యెరుగనే యశోదమ్మ
యెఱుక లేనివారిమాట విని నన్నుకొట్టకే జనని ॥ ఎరు ॥
గొల్లవారి వాడలకు వెళ్ళితివా లేదా నీవు
వెల్లడింపు మన్న నిజము కల్లలాడకున్నా విడతు ॥ ఏమి ॥
చల్ల లమ్ము గొల్లభామ బెల్లము పప్పులు బెట్ట
నల్లనయ్య రమ్మటన్న వెళ్ళితినే యింతేగాని ॥ ఎరు ॥
పున్నమజాబిల్లిజూడ కన్యకామణు లంత గూడ
పిన్నపడుచు జూచియేమో కన్నులెగుర వేసినావట ॥ఏమి॥
అమ్మరో నే వీథిలోన బొమ్మలాటలాడుచుండ
కొమ్మ జూడ కన్నులదరె కువలయాక్షి యింతేగాని॥ఎరు॥
బలరామన్న రమ్మటన్న పలుకకనే వెళ్లినావట
చెలులవాడ జొచ్చినావట తులువపనులు జేసినావట॥ఏమి॥
అన్నె మెరుగ పున్నె మెరుగ నమ్మ నందదాసు బిలువ
నిన్న చాగంటిపురి సంభ్రమ మే జూచితి నింతేగాని ॥ఎరు॥

తే॥ అందెలు గజ్జలు చిందులు ద్రొక్కుచు నాడుచుండు బాలుఁ
సుందరమూర్తిని కొట్టగజాలక సోలుచు జనె లీలఁ

వింతలు జేయుచు గంతులు వైచుచు వేడుక లలరంగన్
కాంతల వ్రేపల్లెంగల యింతుల భ్రాంతిమతుల నొంపన్
చిక్కని చక్కని టక్కరిబాలుని మక్కువ నానాటన్
చక్కదనములకు సొక్కిరి చిక్కిరి సతులు వలచియువ్విటన్.

వ. మఱియు, సత్కాంతామణులు దివ్యమంగళవిగ్రహంబును జగన్మోహనాకారంబును నగు తదీయరూపంబున సోలువడి సాకులకు పోక లిడుటయెగాక కృష్ణసందర్శనంబు లభింపని దినంబులు యుగంబులని తోచునంతటి ప్రేమాతిశయంబు మిక్కుటం బగుడు నం దొక బాలికామణి.

హిందూస్థాని రాగము - చతురశ్రగతి తాలము.

యశోదాకుమారక మా యింటికినుగ రారా
కిశోరముల తమాష జూడ కృష్ణ యిదే వేళ ॥యశో॥
బిలిబిలిపల్కులు బల్కుచు చిన్నికృష్ణా ముద్దులు గుల్కుచు
కలువలు బోలినకన్నుల చెలువము తళ త్తళ మెరయ॥యశో॥
ముద్దులమురహర నరహరి మోహనకారా శౌరి
మద్దుల గూల్చిన ధీర నీ ముద్దుమోము జూపగ ॥యశో॥

వ. ఇటులుండ శ్రీకృష్ణుని జన్మదినంబగు గోకులాష్టమి మహోత్సవంబునకు యశోద వ్రేపల్లెం గల గోపికల నెల్లరం గూర్చుకొని బాలునికి తలంటి జలకమార్చి కీల్గంటు దీర్చి వాల్గంటులకు వాయనంబు లిచ్చుతఱి శ్రీకృష్ణుని జుట్టి మందయానలానందంబున హారతులెత్తి మంగళాశాసనం బొనర్చ.

హిందూస్థాని కాఫీరాగము — ఆదితాళము.

గోపికాలోలకా గోపాలబాలకా గోవర్ధనోద్ధారకా
శ్రీకృష్ణ ॥గో॥
రాజీవలోచనా రాక్షససంహారణా రాధామనోనాయకా
శ్రీకృష్ణ ॥గో॥
రమణీయరూపకా రణరంగభీమకా రారనందబాలకా
శ్రీకృష్ణ ॥గో॥
కమలామనోహరా కనకాంబరధరా కరుణాలవాలశ్రీకరా
శ్రీకృష్ణ ॥గో॥
నందదాసపోషకా నవనీతచోరక వందితవాసుదాసకా
శ్రీకృష్ణ ॥గో॥

వ. అని పాటబాడుచు గోవిందుని సరససల్లాపభాషణంబుల కానందం బందుచు పొద్దులు బుచ్చుచుండ ఒకానొక సమయంబున విధాత గని వారలభాగ్యంబున కాశ్చర్యం బంది.

శ్లో. వందే నందవ్రజ స్త్రీణాం పాదరేణు మభీక్ష్ణశః,
యాసాం హరికథోద్గీతా పునాతి భువనత్రయం.

వ. అనికొనియాడి వారల నాశీర్వదించి చనియెనట. మరియు నవ్వల్లవకన్యక లుల్లంబులు పల్లవింప దినదినప్రవర్ధమానంబగు కృష్ణానురాగంబున నొకవిజనస్థలంబున సమావేశంబై శ్రియఃపతిని తమపతిగా వరింప నిశ్చయంబు గావించుకొని గౌరిదేవి నుద్దేశించి.

క. ఓకాత్యాయని భగవతి
నీకుఁ మ్రొక్కెదము మేము నేఁ డనుకంపన్

మా కిందఅరుసు వైళమ
శ్రీకృష్ణుడు మగఁడుగాఁగ జేయుము తల్లీ.

వ. అని నమస్కరించి, హవిష్యంబులు గుడుచుచు నివ్వి ధంబున మాసవ్రతంబు సలిపి రందొక్కనాడు.

తో॥ ఓయ్యారంబున నడిచిరి యమునకు వ్రతము సలుప నెంచి
చయ్యన సైకతతలములపొంతను, చలువమడుపు లుంచి,
చెలియలు తమలో చిన్నికృష్ణుని చెలువునిగా గోరి
అల యమునానది జలకము లాడగ నతివ లంత జేరి.

శహానరాగము, ఆదితాలము - (జలక్రీడ).

చెలియలారా, జలకేళి సలుపుదాము రాండి!
కలికి కృష్ణు డెందున్నాడొ, కనిపెట్టియుండండి వాని॥ చెలి ॥
గౌరీవ్రతముల నోచి కాంతూని బడయ మంచి
వరము సంపాదించి వనమాలి గలియ నెంచి ॥ చెలి ॥
చల్లనీ యమునలోన జల్లు లాడి వేగమున
వెళ్లుదాము దేవికిని మల్లెలాతో పూజింపగ ॥ చెలి ॥
సర్వమంగళాదేవి పార్వతి పరమేశ్వరి
సర్వాభీష్టప్రదాయిని సన్నూతింపరె పాహి ॥ చెలి ॥
చీరెలు లే వేమమ్మ సిగ్గులు బోయెగదమ్మ
నారీమణులారా బలె నగుబాటాయెగదమ్మ॥ చెలి॥
నందానందనుడే యిక సందేహ మేలనె చెలి
నందాపోషకుడే చీరె లంది యెందో డాగెనే హరి ॥ చెలి॥

వ. ఇవ్విధంబున గోపికలు తమచీరెలు పోయినజాడ తెలియంగక తపించుచుండ చీరెలు ముచ్చిలించి, పొన్నమ్రాని నారోహించి.

ఆ. వె. పరమయోగిహృదయభద్రపీఠంబుల
నుండుమేటి వ్రజవధూత్తరీయ
పీఠమున వసించి పెంపారె త్రిభువన
దేవి లక్ష్మి మేన తేజరిల్ల.

వ॥ మరియు నక్కాంతలు తమచీరలు పోయినజాడ తెలియంగక వ్యాకులాయత్తచిత్తలై.

నాటకురంజి రాగము - ఆది తాలము.

వెదుకారె చెలియ చీరెలు గొన్నవాని
వెన్నుడె కాని యింతకు వచ్చె వాని ॥వెదు॥
అడుగులజాడలు నటు చూడరమ్మ
హాలకులిశా రేఖ పద్మము లున్నవమ్మ ॥వెదు॥
కృష్ణునిపాదచిహ్నము లవునె కొమ్మా
స్పష్టముగా దొంగకృష్ణుడే నమ్మా ॥వెదు॥

ఉ॥ నల్లనివాడు పద్మనయనంబులవాడు కృపారసంబు పై
జల్లెడువాడు మాళిపరిసర్పితఫించమువాడు నవ్వు రా
జిల్లెడుమోమువాడొకడు చెల్వలమానధనంబు దెచ్చెనో
మల్లియలార మీపొదలమాటున లేడుగదమ్మ తెల్పరే.

వ. ఇట్లు వెదకుచు నం దొకకన్నియ.

తో॥ అదుగో అదుగో యక్కయ్యా దొంగక్కడ నున్నాడె
చిడిముడి వడివడి చీరెలెత్తుకొని చెట్టు యెక్కినాడె,
కన్నులార్పుచును పొన్నగున్నలో వెన్ను డున్నవాడె
చిన్నికృష్ణుడే సకియలార మన సిగ్గులుగొన్నాడె.

వ. అని తెలుప, సుందరీబృందంబు సందేహంబున గోవిందు నుద్దేశించి.

శంకరాభరణము రాగము - ఆదితాలము.

పొన్నచెట్టుపై పోకిరికృష్ణా వెన్నదొంగ రారా - చీరెలు
గొన్నదొంగ రారా॥
నన్నుతాంగి మీ రిన్నిదినంబులు సల్పినవ్రత మేమీ -
దానికి గలిగిన ఫల మేమీ ॥ పొ ॥
ఆడువారిసుద్దులు నీకేలను అడుగరాదు పోరా-కృష్ణాఅడుగ
మగవారితో మీకుమాత్రె మేలను మగువలారా చెపుడీ -
నాతో ॥ మగువ ॥
సిగ్గులుదీయగ చీరెలు గొంటివి చిన్నికృష్ణ తగునా -
నీ కిది ॥ చిన్ని ॥
మాటలాడ పెరమగవారలతో మానినులకు దగునా -
కామిని ॥ మాని ॥
దండమైన బెట్టెదము నీకు నీమొండితనము విడరా -
కృష్ణా ॥ మొండి ॥
నోటను బల్కెడి బూటకపుదండము లేటికి బెట్టండీ -
చెలి ॥ ఏటికి ॥

చెమ్మెత్తి దండంబు బెట్టెదము చీరె లియ్యర కృష్ణ -
మాకు ॥ చీరె ॥
ఒంటిచేతి దండంబు గొనుట యౌవనమాలికి దగునే -
చెలి ॥ యౌవన ॥
సర్వసమర్పణ హరి నీ కర్పణ కరము లెత్తితిమిరా -
రెండు ॥ కరము ॥
చాగంటీపురిధాముడనై నే చెలియ రొయిచ్చితినే -
చీరెలు॥చెలి ॥

వ. వ్రతఫలంబు గోరి చేలంబులు విడిచి సలిలంబులాడిన శీలవతుల యపచారంబునకు ప్రాయశ్చిత్తంబుగా వస్త్రాప హరణం బొనర్చి సమాశ్రయంబు గోరిన ప్రేమాతిశయంబునకు సచేలాంచలంబు లిడి శాస్త్రవిధి బంధవిమోచనంబు గావించి మరల సన్నిధానంబు గల్పింతు నని యభయప్రదానం బొసంగి గృహంబుల కనిచె నంత.

ఆ। వె। కామతంత్రటీక కలువలజోక కం
దర్పధాక విటులతాల్మిపోక
చకితచక్రవాక సంప్రీత జనలోక
రాక వచ్చె మేలురాక యగుచు.

వ. ఇట్టి శరద్రాత్రియందు యమునానదీసైకతంబున శ్రీకృష్ణుండు ప్రవేశించి జగన్మోహనంబుగా వేణునాదంబు పూరించి బ్రహ్మగాంధర్వం బను రాగంబు నాలాపనంబు జేసి గానంబు జేయ నది విని వ్రేపల్లెంగల మత్తకాశినులున్మత్తలై

యుత్తమామల నన్నదమ్ముల బావమఱదుల జననీజనకుల పతుల సుతుల యడ్డంబులు సరకుగొనక తదీయసన్నిధానంబు ప్రవేశించిన శ్రీకృష్ణుండు తనలీలామానుషవిలాసంబగు రాసక్రీడా మహోత్సవంబు గల్పించిన.

జంఝూటిరాగము - ఆదితాళము (రాసక్రీడ).

గో॥ రాసకేళిలోల కృష్ణ భాసురగోపాలబాల
నీసమాన మెవరు గలరు నీలవర్ణ యిటుల రార ॥రాస॥

కృ॥ భామలార నాదుప్రియ లేమలార రాండి రండి
కాముకేళి గోరిన మీ కామితంబు లిత్తు జుండి ॥భామ॥

గో॥ వేణుగానలోల సిగ్గుమానసంబు దీతువేర
పాణి పాణి గదియజేసి బట్టుదు బల్ జాణవేర ॥రాస॥

కృ॥ మందయానలార మీమనోరథంబు సఫలమంద
కుండలాకృతిని దీర్చి మండలభ్రమణంబొనర్తు ॥భామ॥

గో॥ అందగాడ బల్ పసందు సందరి సిటు దీర్చితౌర
నందనందన యిందు రార సుందరాంగ మందరధర ॥రాస॥

కృ॥ కుందరదన చంద్రవదన యిందువంశీ నాతమాస
మందగమన చూడరె నాడెందం బానంద మొంద ॥భామ॥

గో॥ నామనోహరాంగ కృష్ణ నాదు ముద్దుబాల కృష్ణ,
నందదాసపోష కృష్ణ నాదుప్రియ రార కృష్ణ ॥ రాస ॥

కృ॥ ఒక్కడనే జగమేలితి నొక్కడనే మిమ్మేలితి,
దక్కెను చాగంటీపురి చిక్కెను కృష్ణుడు మీవల॥ భామ॥

వ. ఇవ్విధంబున శ్రీకృష్ణుండు, బృందావనంబున గోప గోపికావినోదుండై బలరామ సహితుండై, పూతనా శకటా సుర తృణావర్త కేశి వ్యోమాసురాద్యనేకకంసభటాగ్రేసరుల మారణంబు గావించి లీలావినోదంబుల కాలంబు బుచ్చుతఱి మధురాపురవరంబున కంసుం డమాత్యవర్గంబుతో యోచింప సభం జేరి.

హిందూస్థాని తోడిరాగము - ఆదితాలము.

ఏమి చేయుదుఁ - నెటులతోచ దహాహా ॥ఏమి॥
నామనంబునఁ - నేమేమో భయ మగుచున్న ॥దేమి॥
ధీమసమున వసుదేవదేవకీ - దేవులకల్యాణంబుఁ -నే-
ప్రేమఁజూడదలఁకంగఁ గవి - నామనోరథంబు విఫలమందగ
నాడె మున్న మిన్ను కొన్ని పల్కుల ॥నేమి॥
దేవకియష్టమగర్భుఁ - తీవ్రత నాతల ద్రుంచు ననుచు బల్కె
తోడన దేవవాణియు దెలిపెఁ - నా- కానిధి దలఁపోయఁ
భావ మెంతో తల్లడంబు జెందగ - బాల కొఱకిసూడిన
ట్లనెఁ హా ॥ఏమి॥

వ. ఇన్నటికిసండియు నాచేయు ప్రయత్నంబుల నొక టియు సిద్ధింపదయ్యె.

తో. బాలఘాతకి పూతన బోయిన బాట దెలియరాదు
చాలదినంబులు గడచిన నేటికి జాడ దొరుకలేదు
అకటా శకటాసురు డేమాయెనో ప్రకటము గాలేదు
వికటమాయెవిధి తృణావర్తు డెటువెళ్ళెనో తెలియగరాదు

ప్రియత్న మెంతో చేసినగానీ ప్రతిజబాబు లేదు
ప్రియమిత్రులు ఏమైరో తెలిపెడి పెద్దలు గనరారు.

వ. అని చింతాకులమానసుండై మంత్రాలోచనంబు గావింపుచున్న సమయంబున త్రిలోకసంచారియు త్రికాల వేదియు నగు నారదుండు.

కాఫీరాగము - ఆదితాలము.

నారాయణ, నారాయణ, నారాయణా, శ్రీమన్ ॥నారా॥
వారణేంద్రవరద సర్వకారణ కమలాక్ష శౌరీ
పారావారశయన నిర్వికారా మేరుధీర రాత ॥నారా॥
పరమపురుష భక్తవరద భానుకోటిదివ్యతేజ
నిరతము నీనామస్మరణ మరువజాల శరణు దేవ ॥నారా॥

తో. నారాయణ గోవిందా యనుచును నారదుఁ డేతెంచెన్
పారవారవిహార రమాపతి పరమపురుష యనుచున్.

వ. కంసుఁడు సభాస్థానం బలంకరించిన నారదున కర్ఘ్య పాద్యాదివిధు లొసంగి యుచితాసనం బిడి కుశలప్రశ్నంబు గావింప నృపాలా నీయభీష్టం బెరింగియే నే నిటకు వచ్చితిని. నీచే పంపబడిన రక్కసు లందరును వసుదేవసుతుండై బృందా వనంబున నందయశోదలకడం బెరుగుచున్న శ్రీకృష్ణునిచే హతు లైరి. ఇది దేవరహస్యము. నీయందలి ప్రేమచే నెరింగించితి.

చ. వినుమని నారదుండు మదివేడుకతోడ యశోద కూతు దా
గనుటయు జక్రి దేవకికి గర్భజుఁడౌటయు మున్ను రోహిణీ

తనయుఁడు రాముఁడౌటయునుతద్విభు లిద్దరుమందనున్న వా
రనియు నెరుంగ జెప్పిన మహాద్భుతమంచు జలించి కిన్నతోఁ.

వ. వసుదేవుండు తనను వంచించి బిడ్డల దాటబంచెనని వధింప నెంచిన కంసుని వారించి కృష్ణునిపై పురికొల్పుటయు తత్క్షణంబ మంత్రిపుంగవుండగు నక్రూరుం బిలిచి నీవు బృందావనంబున కేగి నందాదిగోపకులవలన మనకు రాగల కానుకలంది ధనుర్యాగమునకు దధిక్షీరఘృతంబులం గొనిరం డని నియోగించి నీరథంబునంద రామకృష్ణుల నెక్కించుకొని మూడవనాటియుదయంబున మధురాపురి ప్రవేశింపవలయు నని యాజ్ఞాపింప నతండు చిత్తం బనుటయు, నారదుం డటనుండి బయలు దేరి.

నామసంకీర్తనము - ఆదితాలము.

రమాపతే రమాపతే రమాపతే శ్రీభామాపతే
లక్ష్మీపతే లక్ష్మీపతే లక్ష్మీపతే శ్రీభామాపతే
రాధాపతే రాధాపతే రాధాపతే సత్యభామాపతే
సీతాపతే సీతాపతే సీతాపతే శ్రీభామాపతే.

తో. కలహభోజనుం డిది సమయం బని కంసునివృత్తాంతంబు
జలరుహనాభున కెరింగించుటకు జనెఁ బృందావనంబు
లీలామానుష బాలుని మునిజనలోలుని ముందట గాంచెఁ
శ్రీలలనామణిసేవితునకు సాగిలపడి యిటుల స్తుతించెఁ.

శా. కృష్ణా నీ వొనరించు కార్యములు లెక్కింపఁ సమర్థుండె వ
రిష్ఠుండైన విధాత మూడుగుణముల్ దీపించు లోపించు, రో

చిష్ణుత్వంబున నందునీవలన నిస్సీమంబు నీరూపు రీ
విష్ణుల్ జిష్ణు సహిష్ణు నీశు నమితుల్ విశ్వేశ్వరుల్
మ్రొక్కెదన్.

వ. దేవా కంసుండు ధనుర్యాగంబను నెపంబున నక్రూరు నిటకు బుత్తెంచుచున్నవాడు. నీయవతార ప్రయోజనంబు మఱచి గోపగోపికలతో నాటపాటల లీలావినోదంబుల కాలంబు బుచ్చు మేలగునే? చాణూర ముష్టిక ముర నరక పౌండ్రక శిశుపాల దంతవక్త్ర సాల్వప్రముఖాదులు నీచే మడియవలసి యున్నది. పారిజాతాపహరణంబును స్యమంతక సంగ్రహంబును నృగమహారాజు శాపమోచనంబును అర్జునసారథిత్వంబున భారతరణంబునందనేకాక్షౌహిణీబలంబుల హరించి భూభారంబు దీర్చుటయు జరుగవలసియున్నది. కార్యంబు చాలినంత కలదు. కంసవధంబు ప్రస్తుతము జరుగవలయును. కృష్ణా! సెలవా సంగుమని యనుమతిం గొని మూరాముళ్ళ సన్యాసి యరిగిన యనంతరంబ మధురాపట్టణంబునుండి అక్రూరుండు ప్రయాణంబై, చనుచో.

ఉ. ఎట్టి తపంబు సేసితినొ యెట్టి వ్రతంబులఁ జేసియుంటినో
యెట్టి సువర్ణదానములు నిచ్చితినో తొలిజన్మలందు నా
యట్టి వివేకహీనునకు నాఁడు మునీంద్రులు యోగదృష్టులన్
బట్టగలేని యీశ్వరుని బ్రహ్మమయున్ హరి జూడఁగల్గెడిన్.

వ. అయినను పగవాఁడగు కంసునిచే బంపబడినవాఁడ నగుటచే యవమానంబే ఘటించునో బహుమానంబు గల్గునో

తెలియఁడు. అనంతకోటిబ్రహ్మాండనాయకుండును సర్వజ్ఞుండును నగు శ్రీకృష్ణునకు వావృత్తంబు విదితంబు గాకుండునా కాని మ్మాపి ధైర్యం బవలంబించి రథం బారోహించి పురంబు నిర్గమించి యమునాతటిం దాటి బృందావనంబు ప్రవేశించి.

బేహాగ్ రాగము - త్రిశ్రగతి.

భళిరే, బృందావనంబు బాగై యున్నది
నళినతికిరణముల్ జొర నలవి కానిదీ ॥అహాహా॥భళి॥

తలిరుటాకు లలరుమావిరుల్ ఫలభూజములు లిలను బారికు
కలువతేనెఁ దెగడెడుకాంతిఁ సుమచయ మహాహా ॥భళి॥

నందనవనమా యిది సౌగంధికవనమా - చందనవనమా
కృష్ణునిబృందావనమా అహాహా ॥ భళి ॥

క. జలజాంకుశాది రేఖలు
గల హరిపాదములచొప్పుఁ గని మోదముతోఁ
బులకించి రథము డిగి యు
త్కలికఁ సంతోష బాష్పకలితాక్షుండై.

వ. నేలపై శ్రీకృష్ణపాదచిహ్నంబులం గని తచ్చిహ్నిత ధరణీపరాగంబు మేన నలందుకొనం బొరలిపొరలి యెట్టకేలకు లేచి రామకృష్ణులసన్నిధిం బ్రవేశించి.

క. కని వారలపాదములకు
వినయంబున మ్రొక్కి భక్తివివశుం డగుచుఁ
దనువున పులకాంకురములు
మొనయఁగ నానందబాష్పములు జడిగురియఁ.

వ. కరకమలంబులు ముకుళించి పరవశత్వంబున వినీలితనయనుండై నిలిచియున్న యక్రూరుం గౌగిలించి పరమాదరంబున కుశలప్రశ్నంబు గావించి.

తో. క్షేమమె వసుదేవుడు దేవకియును క్షేమమె బంధువు లంతా
క్షేమమెమామయు క్షేమమెతాతయు క్షేమమెమనవారంతా
ఎందునిమిత్తమొ యిచ్చటిరాకకు నేమిహేతువులు గలిగె
అందరు సుఖులై యున్నారలె మీ యక్రూరత్వమె పొసగె.

వ. అని యడిగిన వేర్వేర క్షేమంబు దెలిపి.

హిందూస్థాని ముఖారిరాగము - రూపకతాలము.

పరమపురుష విగతకలుష భవవినాశకా
శరణు శరణు కరుణ జూడు శాంతిదాయకా కృష్ణా ॥పర॥
సరసిజగర్భాదులు నిను సన్నుతింపజాలరు కరి
వరదా నాతరమె తెలియ వచ్చితి మది మెచ్చితిహరి ॥పర॥
నామొఱ నేరము లెన్నకు నాహృదయం బెడబాయకు
శ్రీయుతుడవు గమ్మ్మ లెమ్మ్మ శుభమతి శీఘ్రమ్మ్మ రమ్మ్మ
నీయురదంబున మధురకు నీలాంబర కేశవులన్
నాయుధయజ్ఞము జూడన్ నను దెమ్మ్మని జేసునేడు ॥పరమ॥

వ. ఇట్లు సవినయంబుగా నక్రూరుండు శరణాగతుండై శ్రీకృష్ణానుగ్రహంబు వడసి కంసునికి నారదుండు తెల్పిన విధంబును దేవకీవసుదేవుల వధింప నెంచిన దేవముని వారించుటయు ధనుర్యాగమిషంబున తనను బుత్తెంచుటయు మొదలగు

విషయంబుల నెఱింగింప సమయంబు నిరీక్షించుచున్నవాఁ డగుటచే నందాదుల బయలుదేర నియోగించి ప్రయాణోన్ముఖుం డగుటయు గోపిక లీవార్త నెఱింగి యొకచోఁ గుమిగూడి తమలోఁ.

సింహేంద్రమధ్యమరాగము - ఆదితాళము.

అక్రూరుం డను పేరిటవాఁడట, చక్రిని గొంపోవఁ
వక్రత్వంబున వచ్చినవాఁడే వలదని కృష్ణుని
నిరోధింతమా ॥ అ ॥

చెలియలార మన చెలువుని బాసిన జీవము లుండునటే
వలువ వీ డొకఁడు దాపురించెనే ప్రాణేశుని యెడబాపు
క్రూరుఁడై ॥ అ ॥

పెద్దలకైనా తెలియరాదటే వద్దనఁగూడదటే
బుద్ధి యెచట డాగె మనయశోదకు పొలతి యికెక్కడి
కాపురంబె హా ॥ అ ॥

రమ్మనినంత పురంబున కేగెడు రానని తెల్పగకూడదటే
కొమ్మరొ నమ్మినవారల వీడుట గోవిందున
కిది న్యాయమటే ॥ అ ॥

పురసతుల వలల దగుల్కొనిన నిక పొలతి! యీవలన
జూచునటే
మఱిగి హరి మనల కనుల జూడని మాటయె నిజమని
తెలియరాదటే ॥ అ ॥

వ. అవియిట్లు గోపికలు చింతాకులమానసలై శ్రీకృష్ణుని కిట్లనిరి.

సీ. నీపాదకమలంబు దాపుచేరగ గాని
తరలిపోనంగ పాదములు రావు
నీకరాబ్జంబుల నెఱి నంటుటకె కాని
తక్కినపనికి హస్తములు సారవు
నీవాగమృతధార నిండఁగ్రోలంగ గాని
చెవు లన్యభాషలు సేరివినవు
నీసుందరాకృతి నియతి జూచుటె కాని
నయనంబు లెందు నన్యముల గనవు

నిన్నుఁ గాని పలుకనేరవు మాజిహ్వ
లొల్ల ననుచు బలుకనోడ వీవు
మామనంబు లెల్ల మఱపి దొంగిలితివి
ఏమి సేయువార మింక గృష్ణ.

హిందూస్థాని ముఖారిరాగము - ఏకతాలము.

న్యాయముగాదు కృష్ణా న్యాయముగాదు
హా యిక దిక్కెవరు నాథ అకటా మము విడనాడఁగ ॥న్యా॥
విన్నది లేదు మున్నెన్నడు మే మిట్టివార్త విన్నది లేదు
వన్నెకాడ! నిన్ను విడచి యున్నారమె యెన్నడైన
పన్నగశయనా మమ్మెడబాయుట కెటుమనసొప్పెను॥ న్యా॥

కన్నులజూడు నావిన్నప మాలించి దయగ కన్నులజూడు
నిన్న మొన్నదాక కృష్ణా ఎన్నెన్నో సున్నవలాడి
వెన్నుడ! నీ వేగినచో వెడలుసుమీ జీవంబులు
పన్నిద మానందదాసపాలక నిర్లేపక యిది ॥న్నా॥

సీ. ఈపంచబాణాగ్ని నేవెంట నార్తుము
నీమంజువాగ్వృష్టి నెగడదేని
ఈమన్మథాంభోధి నేత్రోవ గడతుము
నీదృష్టి నావయై నిలువదేని
ఈచిత్తజధ్వాంత మేజాడ జెరతుము
నీహాసచంద్రిక నిగుడదేని
ఈదర్పకజ్వర మేభంగి నడతుము
నీనవాధరసుధ నింపవేని

ఎట్లు నిర్వహింతు మేలాగు మాలాగు
కరుణ సేయవేని గదియవేని
మరుడు నిర్దయుండు మననిచ్చునే యశో
దాకుమార, యువతిధైర్యచోర.

తో. హాకృష్ణా నిన్నెడబాసియు మా కరనిముసంబేని
నికృష్టంబుగ ప్రాణము లుండునె నిజ మెరుగుదుగాని
చిన్ననాటినుండియు మాచేసిన స్నేహ మెటులబోయె
కన్నతల్లిదండ్రుల రోసిన మా కాఫల మిటులాయె
ఏమి సేతు మిక నెటుబోదుము మా కెవరు దిక్కటంచు
భామిను లేడ్చిరి కృష్ణునిచుట్టెడబాయజాలమంచు.

# కంసవధ

వ. ఇవ్విధంబున హాహాకారంబు లొనర్చు గోపికల మరలి వత్తునని యేమేమియో సమాధానంబులు బల్కి యోదార్చి నందాదులకు పయనంబు సెప్పి యక్రూరునితో శుభ ముహూర్తంబున.

తోడిరాగము - రూపకతాలము.

కదలిరీ- బలరామకృష్ణులు
రథమున వేంచేసి మధురరాజమార్గమున వేగ
పొదలుచు సారథి తేరట బుడబుడ దోలగ వనముల్
గడిసి యమునతటిదిగి రావిదితయశులు మధ్యాహ్నము॥కద॥

శుచులై సలిలము గ్రోలి సుందరమూర్తులు వెడలీ
సచరాచరభూతకోటిజాలము నేలిన మేటి
వశుడై యక్రూరునకును వరదుండై మడుగులోన
విశదపరచె మొదలిరూపు విష్ణుడు జిష్ణుడు కృష్ణుడు ॥ కద ॥

తో. మహనీయంబగు శేషతల్పగతుమహదాకారము గాంచి
అహం త్వా పాపేభ్యో దాసోహమ్మని హస్తంబులు జోడించీ
ఆనందంబున నోలలాడి శ్రీహరిని రథంబున గాంచి
భానుకోటితేజుండై మడుగున ప్రబలుకృష్ణు వీక్షించీ
దశవేషములు ధరించినట్టి శ్రీధవునిమహిమల దలంచి
విశదముగా ప్రస్తుతించె నిట్లని విన్నపంబు గావించీ.

పూరికల్యాణి రాగము - ఆదితాలము.

నారాయణ దేవా మహానుభావ ॥నారా॥

మచ్ఛరూపమున మ్రుచ్చుసోమకుని
వ్రచ్చి వేదములు దెచ్చితే నమో ॥నారా॥

కూర్మరూపమును పేర్మి వహించియు
నర్మిలి మందర మెత్తితే నమో ॥నారా॥

వరాహరూపమున హిరణ్యాక్షునిఁ
దురములోన బరిమార్చితే నమో ॥నారా॥

నారసింహుడవై హిరణ్యకశిపునిఁ
గోర జీరి కడతేర్చితే నమో ॥నారా॥

వామనుండవై ధీమనమున బలి
తామస మడచియు తరలించితే నమో ॥నారా॥

పరశురాముడవై దురుసుక్షత్రియుల
కరకుకరకున ఖండించితే నమో ॥నారా॥

శ్రీరాముడవై మారుతి నేలియు
నారావణు హతమొనరించితే నమో ॥నారా॥

బలరాముడవై హాలమున దానవ
కులనాశమ్మును గూర్చితే నమో ॥ నారా ॥

బుద్ధరూపమున నొద్దిక గోపిక
బుద్ధులు జెరపిన కృష్ణతే నమో ॥ నారా ॥

కలికిరూపమున నవతరించి యీ
కలియుగాంతమున గాచెదే నమో ॥ నారా ॥

మ. కలలం బోలెడు పుత్రమిత్రవనితాగారాదిసంయోగముల్
జలవాంఛారతి నెండమావులకు నాసల్ సేయుచందంబునన్
దలతున్ సత్యములంచుమూఢుడవ్యర్థాత్త్వజ్ఞుడన్ నాకు నీ
విలసత్పాదయుగంబు జూపి కరుణన్ వీక్షింపు లక్ష్మీపతీ.

హిందూస్థాని పున్నాగరాగము - ఆదితాళము.

సర్వలోకనాయకా అభయప్రదాయకా కృష్ణా ॥సర్వ॥
పార్వతీశ సరసిజోద్భవామరపాలితాయ శ్రీధ
రాయ తే నమో ॥ సర్వ ॥
భోగిభోగతల్పకా యోగీంద్రకల్పకా కృష్ణా ॥ భోగి ॥
ఆగమోక్తసంచారక అఖిలలోకపాలక శ్రీ
చాగంటీపురినాయక శ్రితజనపోషక నమో నమః ॥సర్వ॥
వాసుదాసపాలకా వసుదేవకుమారక కృష్ణా ॥ వాసు ॥
దోషరహిత మాం పాలయ దుష్టదైత్యవిచ్ఛేదక
భాసురాంగ శ్రీనాయక దాసానందదాయక నమో నమః
॥సర్వ॥

వ. అని స్తుతింపుచుండ విష్ణుండు తిరోహితుండగుటయు, మడుగు నిర్గమించి రథంబు జేరం జను భక్తాగ్రణితో భక్తజనావనుండు.

క. జలములు చేరువ నున్నవి
తలపోయగ నీవు పోయి తడవయ్యె నదీ
జలముల సభమున ధరణిన్
గలుగనిచోద్యములు నీకు గానంబడెనే?

వ. ఇంత యాలస్యంబునకు గారణం బేమి యక్రూరా యను శ్రీకృష్ణునివరోక్తులకు సంతసించి సాష్టాంగదండ ప్రణామం బాచరించి మహాత్మా!

ముఖారిరాగము - త్రిశ్రగతి తాలము.

వాచామగోచరా వసుదేవసుతా కృష్ణా
నీగుణతత్వము నే దెలియ నెంతవాడ
ఈ గంగయమునను నీవే యీరథంబుపై నీవే
ఈగగనంబున నీవే నీవు లేని చోటుగలదె ॥వాచా॥

దివ్యమంగళసుందరమూర్తి కృష్ణా
అవ్యయ జగత్కారణహేతురూపా
సర్వవ్యాపకసర్వంబులు సకలభూతజాలంబులు
నిర్వికార నిర్లేపక నిరతిశయానంద నీవే ॥వాచా॥

వ. ఇట్లు వినుతించి రామకృష్ణుల యనుమతంబున సాయంకాలంబునకు రథంబు మధురాపుర సమీపంబున విడియించి తనగృహంబునకు రమ్మని ప్రార్థించిన కంసవధానంతరంబ నీ కష్టార్థం బిత్తునని యక్రూరు నొడంబరచి పురంబునకు బోవం బనిచి, అంతకుమున్న పురిబాహ్యాంతరోపవనంబున శకటంబులను విడిచి తమమిత్రులు గాదియున్న నందగోపవీరులం గూడి యపరాహ్ణంబున నగరి ప్రవేశంబు సేయుతఱి పుణ్యాంగనలు సౌధాగ్రంబులం జేరి శ్రీకృష్ణు జగన్మోహనాకారంబు గాంచి.

హిందూస్థాని తోడిరాగము - అటతాళము.

ఏమందు, మీసుందరం బెందులం గందుమే చందన గంధిరో, ఆమందగోవిందుమోమందముం గంద, పేరిమందు, నాసుందరీబృందము, అహాహా ॥ఏ మందు॥

అలరువిల్కాని కొరిన్నెలకాని నలకూబరున కీ చెలువ మెక్కడి దహహ అంద ॥మే మందు॥

మందరోద్ధారుడే కందర్పతేజుడే యిందునిభాస్యుడే యీ మోహనాంగు డహాహా అంద ॥మే మందు॥

మ. చెలియా గోపిక లీకుమారతిలకుఁ జింతించుచుఁ బాడుచుఁ
గలయంబల్కు చునంటుచుఁ నగుచు నాకర్షించుచుఁ హస్తగా
మలకక్రీడకు దెచ్చి నిచ్చలును సన్మానంబులం బొందగా
తొలిజన్మంబుల నేమి నోచిరొ కదే దుర్గప్రదేశంబులఁ.

వ. ఇటుల పురంధ్రీజనంబులు వర్ణింపుచుండ.

తో. మధురానగరపువిపణిమార్గమున మధుసూదనబలు లరిగీ
వధితుభేదనోపాయము లరయుగ వలయాకారము దిరిగీ
కని రాజుల చల్వపుట్టముల గొని చను రజకుని నట గాంచి
వినుమో రీ ప్రభునల్లుండ్రము మా కిమ్ము చేలములు మంచి
వని యడిగిన వా డాగ్రహవశుడై వారల జురచుర జూచి
పని వినకున్నను పట్టి వధించియు పట్టుబట్టలు ధరించీ
గంధము పువ్వు లొసంగిన కుబ్జకు కడువేడుక దీవించి
అందముగా గూర్చినమాలలుగొని యతనివినుతులను గాంచి
చేరి హజారము ధనుర్భంగమును జేసి విడుదలను మంచి
కూరిమి నొసగిన పాయసాన్నములు కుడిచిరాత్రి నిదురించి.

వ. ఉన్నతరి కృష్ణునివృత్తాంతంబు విని కంసుండు.

సీ. కర్ణరంధ్రములు చే గప్పినలోపలి
ప్రాణఘోషము వినబడకడిందె
దోయాదికములందు దొంగిచూచుచునుండ
తల గానరాదయ్యె తనువుమీద
గరశాఖ నాసికాగ్రంబుపై నిడిచూడ
గ్రహతారకలు రెండు గానబడియె
వెలుగున నిలుచుండి వీక్షింపగా మేని
నీడ సరంధ్రమై నేల దోచె
నడుగుజాడ దృష్టమగుట లేదయ్యెను
తరువు లెల్ల హేమతరువుల ట్ల
కానబడియె మరణకాలచిహ్నములౌట
బుద్ధి యెల్ల గలగె భోజపతికి.

వ. ఇటు లానాటిరాత్రి కంసుండు భయాతురుండై నిదుర లేక పరితపించుచుండ సూర్యోదయం బగుటయు కృష్ణుని సంగడీండ్రగు వల్లవబాలు రుల్లంబులు పల్లవింప బుసుకత్తాలం గొని.

గే యము.

రాండోయి పోవుదము రాజుగారిసభకు నేడు
తెండోయి తహశ్శీల్ తెచ్చిందేమో యిచ్చేతాము ॥రాం॥
కత్తిసాము తెల్లసాము గదియ పరులు వచ్చిరేని
కత్తిల్ కత్తిల్ యేట్లాడాలె బుత్తిల్ బుత్తిల్ యెగురా
లేన్॥ రాం॥

వ. అని సంతసంబున కోలాహలంబు లొనర్చుచు ముందు జనుచుండ.

భూపాలరాగము - రూపకతాళము.

కమలనాభు డపుడు వెడలె కంసునిసభకు
విమలులు బలరామాదులు వెనువెంటను జనుదేరగ
కుమతులు గుసగుసలు వోవ కుముదహితాన్వయులు ద్రోవ
ప్రమోదంబున బొబ్బలిడుచు భ్రాంతిరహితులను గావ ॥కమ॥
సామజమును కూలద్రోచి చాణూరుని వధియించీ
రాముడు ముష్టికుని ద్రుంచ రణరంగము ప్రవేశించి
ధీమసమున బట్టి కంసు దెళ్ళవైచి త్రుళ్ళద్రోచె
నామంచెను దిగద్రొబ్బగ నతడు విడచె జీవంబులు ॥కమ॥
కొల్లగ పువ్వులవానలు కురిసిరి వేల్పులు, చానలు
యుల్లమా రంజిల్ల చెలగి చల్లిరి సుమదామంబులు
వెల్లివిరిసె వాద్యంబులు మ్రోల్ల వీచె మారుతంబు
చల్లనయ్యె లోకంబులు దల్లడమందిరి రిపులు ॥ కమ ॥
దేవకీవసుదేవాదులు దీవన లిడ నుగ్రసేను
భావ మెంతొ సంతసించ బంధువులును ప్రేమింపన్
నీవె మాకు దిక్కటంచు నిఖిలజనులు సంస్తుతింప
భూవలయంబున గల యాకోవిదులను బ్రసాదింప ॥ కమ ॥

వ. మరియు నాసమయంబున.

క. చేతుల చిరతలు మీటుచు
చేతోమోదంబుతోడ శిఖముడి వీడన్

పాతరలాడుచు మింటను
గీతము నారదుడు పాడె కృష్ణా యనుచున్.

తో. బలుడును కృష్ణుడు జననీజనకుల పాదంబుల కెఱఁగీ
ఖలుఁడగు కంసునిగాథల దలచియు గనలకు డని యొఱగీ
బంధుజనంబుల ప్రియభాషణముల బహూకృతు లొనరించీ
వందితగుణు లా యుగ్రసేనునకు వందన మొనరించీ.

బేహాగ్ రాగము— ఏకతాళము.

పట్టాభిషేక మొనరించెన్ ఉగ్రసేనభూపునకున్
కట్టాయితంబు జేసి ధరన్ గట్టె మాతామహునకున్
చుట్టంబులు పుట్టంబులు చోద్యంబుగ జదివింపన్
కట్నంబులు కానుక లిడి కమలాక్షుడు హర్షించెన్ ॥పట్టా॥

భళిరే శ్రీకృష్ణా యని బ్రాహ్మణులు స్తుతియింపన్
అళివేణులు కర్పూరంపుహారతులు సమర్పింపన్
చెలువలు తమకంబున మైచేలంబులు జారంగన్
అలమధురాపురిజనముల కానందము గలుగంగన్ ॥పట్టా॥

వ. ఇవ్విధంబున గోవిందు సందర్శనంబు తమకు లభించిన కారణంబున మధురాపురిజనంబులు సకలైశ్వర్యంబులం దులదూగుచుండి రంత.

క. వందనము నందసుతునకు
వందనము ముకుందునకును వనజాక్షునకున్
వందనము భక్తకోటికి
వందనములు దీని జదువువారల కెల్లన్.

## ఆరగింపుపాట.

ఆరగింపుమా కృష్ణా ఆరగింపుమా
ఆరగింపు కృష్ణా మా రాధరుక్మిణి తోడ గలిసి
కోరిన ఫలములను నోనగూర్చి సమర్పించితిమి ॥ఆర॥

అటుకులు కొబ్బరిపలుకులు పటికబెల్లము నానవాలు
పటుతరముగ పాలు వెన్న తటుకున భుజియింపుమన్న ॥ఆర॥

మీగడపెరుగన్నముతో మేళవించినట్టి చలిది
వేగమె శ్రీరంగమాంబ యొగిర మొనరించె నీకు ॥ఆర॥

కండచక్కెర పాలునేయి గలసిన చక్కెరపొంగలి
పిండివంట లప్పడములు దండిగ పూరీలుగలు వడలు ॥ఆర॥

వేదముల కగోచరుడవై వెలసిన మాకన్నతండ్రి!
మాధవ మావూనసముల మరిమరి సమర్పించెదము ॥ఆర॥

మంగళహారతి - సురటిరాగము - ఆదితాళము.

మంగళాహారాతి నీ కిదే గోపాలకృష్ణయ్యా ॥మంగ॥
అంగజజనక విహంగతురగ భవభంగ కమలాహృత్సంగ
రంగ జయ ॥మంగ॥

వెఱ్ఱిగొల్లపిల్లల గరుణింపగ కఱ్ఱిమేని వేల్పవగుచు భాండము
తుట్టుతుట్టునను కూటుబొడచి దధి జుఱ్ఱితివట పసికుఱ్ఱడవై
జయ ॥మంగ॥

నందయశోదలనందనుండవై పొందిక గోపికాసుందరుండవై
మందలోన గల దధిఘృతక్షీరము లందియు మధురకు నరి
గితివట జయ ॥మంగ॥

యదువంశజా వసుదేవదేవకీ వ్యథయిత్రకంసుదురితుధ్వంస
కుడవై। పృథులకీర్తిగని యదుగణంబులను బూని ద్వార
కను జేరితివట జయ ॥మం౯॥

ఒంటిమిట్టవాసుదాసహిత చాగంటిపురిని వెలసినందదాసుని
చంటిబిడ్డగతి వెంటనంటి నీబంటుబంటుగను నేలితివటవయ
జయ ॥మం౯॥

ఓం తత్సత్.

శ్రీకృష్ణార్పణమస్తు.

---

నాదనామక్రియరాగము - రూపకతాలము.

(రామా నిను విడచీ ఎటు లుందునురా) ॥శ్రీరామా॥
రామా పరివిమలసద్గుణధామా సుందరమేఘ
శ్యామా మునిజననందితనామా పరిపూర్ణకామా॥ రామా॥
ప్రొద్దున మేల్కాంచి నీదుసుద్దులె మదిలో దలంచి
అద్దిర సీతమ్మను నా బుద్ధిదీర స్మరియించీ
ముద్దులుగుల్కెడి నీ నగుముఖకమలంబును గాంచి
దధ్యోదనమారగించు పద్ధతి నొద్దిక మరచీ ॥ రామా॥
భజ రే కోదండరామ భజరే గోవిందనామ
భజరే కల్యాణరామ భజరే పట్టాభిరామ
భజరే భజరే యనుచును భజనము సల్పుచు నిత్యము
సుజనసమాజమునృత్యము చూడక మరియుండగలనె
॥శ్రీరామా॥

పాపిష్ఠకార్యము లష్టపడునట్టులుగను జేయకు
ఏ పాపమున కెనమియ్యకు మితరసఖ్యమున ద్రోయకు
రేపో మాపో ని న్నెడబాపదలచితని తెలిసితి
కాపాడ నుపేక్షసేయ నీ పాపం బెటుపోర్తును ॥రామా॥

నానిమిత్త మెంతశ్రమను నాతండ్రీ నీ కిడితినో
నీనిమిత్త మెంతభరము నే ధరియింపగలనో
వీనిశక్తి నీకే దెలియు నే దెలియఁగలనే నిన్ను
కానసీమఁ బోయతగునే, యది వినసే, నే ॥రామా॥

నీ సేవకుడనుగా నీ దాసానుదాసునిగా
జేసినాడ వౌరా! నందవాసున కెడబాటుగలుగ
గాసిగాదె నీసన్నిధి బాసిన దిన మొల్లు గడము
వాసుదాసపాలక నన్ వలదు వలదు విడనాడఁ ॥రామా॥

కేదారగౌళరాగము - రూపకతాలము.

బ్రతికినన్ని దినములు నీ భజనజేతు శ్రీరామా
మతిభ్రమ గలిగినవేళను మఱతు నేమొ రఘురామా
పతితపావనుడ వనుచును బరమదయాళుండ వనుచు
గతి నీవే యనుచును సద్గతి నొసగెద వనుచు నమ్మి ॥బ్రతి॥

కఫవాతపైత్యములు కంఠమునకు నడ్డుపడగ
విపులమైన వీతిబాధ లెనగినతఱి నిను దెలియఁ
నిపుణతగలదే జీవికి నిందలేక బొంది విడున
కృప నెటుజూపెదో నాపై కృష్ణా కేశవ మురారి ॥బ్రతి॥

శరణాగతి జేసిన యా నరునకు నపవర్గ మిడుదు
కరుణ బ్రోతు నన్న నీదు చరమవాక్యసరణి దెలిసి
భరన్యాసమొసగిన యా నరసింహాచార్యకృపా
పరతనాంధ్రవాల్మీకి మీ పరమపదము చూరగొనడా ॥బ్రతి॥

వాసుదాసాచార్యగురువర్యులపాదముల కెరగి
దాస దాసానందదాసదాసుడు ప్రపత్తి జేసి
దోసిలొగ్గి నీపై భారము త్రోసి భద్రగిరిసన్నిధి
కాచియున్న చాగంటిపురి కరుణతోడ జేర్చిన రఘురామా
॥బ్రతికి॥

తోడిరాగము - రూపకతాళము

పరమపదము బోవుద మో ప్రియసఖులారా
కరుణామయు దేవదేవు గరుడగమను భజియింపుచు
సరయూనది ప్రాంతంబున స్వర్గద్వారంబున శ్రీ
హరిని గలిసి పర మేగిన యయోధ్యాప్రజలవలె ॥పర॥

మరల జన్మమునకు రాము మాధవు శరణాగతులము
వెలువము యమశాసనమున కిష్టసఖులగూడి పరా
త్పరుం డనంతు డవ్యయుండు శ్రీహరి
పరంధాముదివ్యసన్నిధానము
సరసుల రగు నర్చిరాదిమార్గము సరణి దెలిసి విరజ దాటి
యావల ॥పర॥

కల దట నిత్యవిభూతి కల దాత్మస్వానుభూతి
కలదు పరమయోగిగణము కల్పద్రుమమున్ నిలయము

కల దానందము కష్టము కలుగ దచటి జనులు సుఖులు
వలదు వలదు వలదు భయము వదలియు శ్రీవైకుంఠుని ॥పర॥

కరిప్రహ్లాదులు మున్నటిఘను లంబరీషాదులు
పరమభాగవతులు నారదపరాశరవ్యాసశుకులు
నిరతిశయానందపరులు నిత్యశూరు లాళ్వారులు
పరమేశునిభక్తవరులు గలరు మనకు సైదోడులు ॥పర॥

లక్ష్మీనారాయణులు కటాక్షంబున వీక్షింపగ
అక్షయశ్రీవిష్ణులోక వైష్ణవసాయుజ్య మిడగ
విష్వక్సేనసుపర్ణులు నెదుర్కొనగ జగజ్జనని
రక్షగట్టి జనకుని ప్రత్యక్షము దీవెన లిడు హరి ॥పర॥

వాసుదాసాచార్యకరుణవలన సమాశ్రయణంబై
భాసిలు కోదండరామభక్తసమాజంబు పేరిమగ
దాస్యంబునకును లక్ష్మీధవుడు సంతసంబు నంద
దాసోహమ్మని నందదాసబృంద మింపొంద ॥పర॥